**Adugaduguna...**
by ***Kavishiromani***
**Prof. Raavikanti Vasunandan**



**Prof. Raavikanti Vasunandan**
Professor of Telugu
Principal Investigator UGC Major Research Project
Dr.B.R. Ambedkar Open University
Road No.46, Jubilee Hills, Hyderabad-33.
Cell: 9849852182

First Edition: **2009**

Price: **Rs.50/-**

*For Copies:*
**All Branches of Vishalandhra**

*Printed at:*
**Vipla Computer Services**
*(Designers & Multicolour Offset Printers)*
Nallakunta, Hyderabad - 500 044.
Ph.: 2765 4003, 2767 6910, 27677078

పధ్నాలుగేళ్ల ప్రత్యక్ష పరిచయానికీ
సహోద్యోగానికీ ఆత్మీయతకూ
అనుబంధంగా
**కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత**



**ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి గారికి**

**- వసునందన్**

# అడుగడుగునా వైవిధ్యం

**ఆచార్య కె.ఎస్. రమణ**

డీన్ ఆర్ట్స్,

డా. బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం,

హైదరాబాదు.

కవి ఒక జీవితం కాదు, అనేక జీవితాలను జీవిస్తాడు. ఒక అనుభవం కాదు, అనేకుల, అనేక అనుభవాల్ని అనుభూతిస్తుంటాడు. సామాన్యుడైన వ్యక్తికన్నా భిన్నంగా జీవన వైవిధ్యాన్ని దర్శించగలుగుతాడు. అక్షరాలా ఆవిష్కరించగలుగుతాడు. ఆచార్య రావికంటి వసునందన్ **అడుగడుగునా...** కవితా సంపుటి ఇందుకు ఓ నిదర్శనం.

అగ్గిపుల్లా, కుక్కపిల్లా, సబ్బుబిళ్ళా, కాదేదీ కవిత కనర్హం - అన్నారు శ్రీశ్రీ. కవి తన పరిసరాల్లో, సమాజంలో అతి సామాన్యంగా, అప్రాముఖ్యమనిపించే సాదా సీదా అంశాల్నుంచి, అసాధారణ విషయాల్ని సామాజిక జీవన వాస్తవికతను, అంతరాంతర సత్యాలను ఆవిష్కరించగలిగే ప్రతిభ ఉన్నవాడు. అలవోకగా అలాంటి కవిత్వాన్ని నిరంతరం రాస్తున్న అవిశ్రాంత సృజన పథికుడు వసునందన్.

ఈ సంపుటిలో కవితలన్నీ లఘు కవితలు. అలతి అలతి పదాలతో నాలుగైదు పంక్తులలోనే కవితలు పూర్తవుతాయి. మన కళ్ళముందు వైవిధ్యభరితమైన జీవన దృశ్యాలను సాక్షాత్కరింపజేస్తాయి. మనల్ని ఆలోచింపజేస్తాయి. కునికిపాట్లు పడుతున్న వాళ్ళ కళ్ళు బైర్లు కమ్మేట్టు ఒక్క చరుపు చరిచి ఉలికిపడేట్టు చేస్తాయి. సాధారణ జీవన దృశ్యాల నుంచి జీవిత సత్యాలను ఆవిష్కరిస్తాయి.

ఈ కవికి తన పాఠకులపై అపరిమిత విశ్వాసం ఉంది. రసహృదయం ఉన్నవారు ఎవరైనా తన కవిత్వానికి పాఠకులే అంటూ కవి చెప్పిన ఈ పంక్తులు గమనించండి-

**ఎవరైతే ఏం? వినడానికి**
**తెల్లగా తెల్లారకముందే నా కవిత్వం**

మా ఏరియా టీబడ్డీ అబ్బాయి రమేశ్ -
రసహృదయం ముఖ్యం.

వసునందన్ లోకజ్ఞతకు, ప్రగాఢ స్పందనకు ఉదాహరణలుగా ఈ సంపుటిలో ఎన్నో కవితల్ని పేర్కొనవచ్చు. ఏ.సి. రూముల్లో కూర్చొని చెత్త ఆలోచనలు, భయంకరమైన కుట్రలు, దారుణ కుతంత్రాలు చేసే మనుషుల్లో కనిపించని విచక్షణ, చెత్తకుండీ దగ్గర వ్యర్థ పదార్థాలు ఏరే అమ్మాయిలో ఉందంటూ కవి చెప్పిన పంక్తులు గమనించండి -

చెత్తమీది ఆలోచనలే తప్ప
చెత్త ఆలోచనలు కనపడవు
చెత్త ఏరుకునే అమ్మాయిలో.

బతుకు వాకింగ్ ఎంత భారమో చెప్పే కవితలో గొంతు తడుపుకోవడానికి గుక్కెడు మంచినీళ్ళు దొరకని దుర్భర బస్తీ జీవన దృశ్యాన్ని కళ్ళకు కట్టినట్టు చూపుతారు కవి.

అటో నలభై ఇటో నలభై
కావడి బద్దకు వేలాడుతూ ప్లాస్టిక్ కుండలు
ఎంత భారం బతుకు వాకింగ్?
మసక వేకువలోనే!
బెదరు చూపుల అమ్మాయికి.

ఈనాడు కవిత్వం బహుముఖం. కవి తన నిత్య, అనుక్షణిక, బహిరంతర సంఘర్షణే భూమికగా కవిత్వం రాస్తాడు. సమకాలీన, సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక పరిస్థితులకు ప్రతిస్పందిస్తూ తనకు జీవితం అర్థమైనంత మేరకు తనతో, ఇతరులతో, ప్రకృతితో సంఘర్షణను, ఐక్యతను ఏకకాలంలో దర్శించగలగడమే కవి ప్రతిభకు నిదర్శనం. సృజనను ఒక తపస్సు లాగా కొనసాగించడమే ఈనాడు కవి ముందున్న కర్తవ్యం. వసునందన్ తన సామర్థ్యం మేరకు ఆ కర్తవ్యాన్ని నెరవేరుస్తున్నారు. అందులో భాగంగానే కర్తవ్య సూర్యుడి పురోగమనానికి ఎలాంటి ప్రతిబంధకాలు ఉండవని కవి ప్రకటిస్తున్న ఈ పంక్తుల్ని చూడండి-

ఆగిపోతాడా సూర్యుడు?
కారుమబ్బులు మింగేసినా
కాలగర్భం చీల్చుకొని జ్వాలగా ప్రజ్వలించక



పట్టపగ్గాలు లేవు పురోగమన శీలికి
పుట్టగతులు లేవు కర్తవ్య విమూఢునికి.

పండిత పామరులను ఏకకాలంలో అలరించే కవిత్వం రాయడానికి కవులు ప్రయత్నిస్తూనే ఉన్నారు. కవిత్వం, కథ, నవల ఆ మాటకొస్తే ప్రతి ఆధునిక ప్రక్రియా సామాన్య మానవుడే కేంద్రంగా, సాధారణ పాఠకుని అందుకోవాలని ప్రయత్నిస్తూ ఉండడం ఈ యుగ లక్షణం. తిక్కన, వేమన, గురజాడ, శ్రీశ్రీ నుంచి గద్దర్ వరకు కవిత్వాన్ని ప్రజాస్వామ్యీకరించే దిశలో తమ వంతు బాధ్యతను నెరవేర్చారు. నెరవేరుస్తున్నారు. ఆ బాటలోనే నడుస్తున్న అసంఖ్యాక కవి సైన్యంలో ఆచార్య రావికంటి వసునందన్ కూడా ఒక యోధుడు. సంప్రదాయ, నవ్యసంప్రదాయ, ఆధునిక రీతి మార్గాలన్నింటిలోను తన ముద్రను వేయాలన్న తపనతో ముందుకు సాగుతున్న వసునందన్ కలం నుంచి జాలువారిన మరో చక్కటి ఈ మినీ కవితల సంపుటిని సాదరంగా స్వాగతిస్తూ ...

- కె.యెస్. రమణ

15-4-09
హైదరాబాద్

# కవిశిరోమణి
# ఆచార్య రావికంటి వసునందన్



జననం : 04.05.1949
జన్మస్థలం : కమాన్‌పూర్
కరీంనగర్ జిల్లా, ఆంధ్రప్రదేశ్
తల్లిదండ్రులు: కీ.శే. శ్రీమతి జగ్గమాంబ, శ్రీ కిష్టయ్య
విద్య : ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి
ఉద్యోగం : తెలుగు ప్రొఫెసర్
ప్రిన్సిపల్ ఇన్వెస్టిగేటర్, యు.జి.సి. మేజర్ రీసర్చ్ ప్రాజెక్ట్
డా. బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

## రచనలు

### కథా కావ్యాలు
రతీప్రద్యుమ్నము (గద్య కథాకావ్యం - 1971)
గురుకులము (విమర్శనాత్మక గద్య కథాకావ్యం - 1978)
భారతం (పద్య కథాకావ్యం - 1980 - డా॥ దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారకపురస్కారం పొందిన కృతి)
బలి (గేయ కథాకావ్యం - 1981)
కృష్ణం కలయ... (పద్య కథాకావ్యం - 2009)
అష్టాక్షరి (పద్య కథాకావ్యం - 2009)

### దీర్ఘ కావ్యాలు
త్రయి (1982)
మనస్సు (2004)
పిల్లలమఱ్ఱి (2006)
మట్టిముద్దలు (2007)
ఆయుధం కవిత్వం (2007)
ప్రవాహిని (2008)



### గేయ కావ్యాలు
శ్రీరామ చరితామృతమ్ (పాటల్లో రామాయణం - 1992)
శ్రీవేంకటేశ్వర తారావళి (సంకీర్తనలు-2005)
ఎందరో మహానుభావులు (జీవిత చరిత్రలు - 2006)

### సాహితీ విమర్శ - పరిశోధన
భావదీపికలు (సాహిత్య వ్యాససంపుటి - 1980)
భూమిక - ఒక సమగ్ర పరిశీలనం (ఎం.ఫిల్. సిద్ధాంత వ్యాసం - 1985)
అష్టాక్షరి (సినారె కృతులపై సాహిత్య వ్యాసాలు - 1987)
ఆధునికాంధ్ర కవిత్వంలో మానవతావాదం - విశ్వంభర విలక్షణత (పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం - 1990)

### వచన కవితలు
సాధన (కవితా సంపుటి - 1981)
కలం కదిలితే... (కవితాసంపుటి - 2003)
మెరుపు మెరిస్తే... (కవితా సంపుటి-2004)
వాన కురిస్తే... (కవితా సంపుటి-2005)
నేల నవ్వితే... (కవితా సంపుటి-2006)
మనసు నిండితే... (కవితా సంపుటి-2006)
సింగిణీ మెలిస్తే... (కవితా సంపుటి-2006)
నెమలి ఆడితే... (కవితా సంపుటి-2008)
గుండె పొంగితే... (కవితా సంపుటి-2009)

### వివిధ కృతులు
వేణీ సంగమం (గేయం, పద్యం - 1975)
ప్రజావిజయం (రేడియోరూపకం - 1990)
ప్రయోజన దండకాలు (దండకాలు - 1993)
జైగణేశ్, బాలాజీ (భక్తిపాటల ఆడియో క్యాసెట్స్ - 1994)
లోవెలుగు (ముక్తకాలు - 2004)
రావికన్నులు (సంక్షిప్త కవితలు-2006)
అనుయోగం (త్రిపదులు-2009)
అడుగడుగునా! (సంక్షిప్త కవితలు-2009)

## బాల సాహిత్యం

బాలజ్యోతులు (పిల్లల కథలు-2007)

బాలబ్రహ్మం (దీర్ఘకావ్యం-2008)

## అనువాదాలు

దౌడ్ (హిందీ అనువాదం) డా.ఎం.రంగయ్య (2006)

రెసొల్యూట్ మైండ్ (ఇంగ్లీష్ అనువాదం) డా.బి.రామచంద్రయ్య (2006)

విరాట్ ఏకతా వట్ (హిందీ అనువాదం) డా. ఎం. రంగయ్య (2008)

## ముద్రణలో

భక్తి (దీర్ఘ కావ్యం)

భారతనారీమణులు (పిల్లల కథలు)

భక్తశిఖామణులు (పిల్లల కథలు)

## పురస్కారాలు

ఎ.పి.ఎ.యు.యస్. సమాఖ్య కడప స్వర్ణపతక పురస్కారం (1982)

డా. దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారక పురస్కారం, హైదరాబాద్ (1982)

శ్రీ జమిలి నమ్మాళ్వార్ స్మారక పురస్కారం, హైదరాబాద్ (1990)

శ్రీ తేరాల జగదీశ్వర్ స్మారక పురస్కారం, హైదరాబాద్ (1993)

శిల్పా ఆర్ట్ క్రియేషన్స్ ఉత్తమ విద్యావేత్త పురస్కృతి, హైదరాబాద్ (1993)

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమ అధ్యాపక పురస్కృతి, హైదరాబాద్ (2002)

డా. వానమామలై వరదాచార్య సాహిత్య పురస్కారం, కోరుట్ల (2003)

కవిశిరోమణి బిరుదప్రదానం - భారతీ సాహిత్య సమితి, కోరుట్ల (2003)

డా.జె.ఆర్.ఇ.టి.రజతోత్సవస్వర్ణపతక,స్వర్ణకంకణపురస్కారం,జగిత్యాల (2003)

వానమామలై జగన్నాథాచార్య సాహిత్య పురస్కారం, కరీంనగర్ (2004)

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉగాది పురస్కారం, హైదరాబాద్ (2004)

పొట్టిశ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయం ధర్మనిధిపురస్కారం, హైదరాబాద్ (2004)

ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘం - భాషావేత్త పురస్కారం, రంగారెడ్డి (2006)

శ్రీ దోమా వేంకటస్వామిగుప్త సాహిత్య పురస్కారం, కడప (2007)

తేజ ఆర్ట్ క్రియేషన్స్, సాహితీ పురస్కారం, హైదరాబాద్ (2007)

భారత పర్యావరణ పరిరక్షణ గవాక్షం - రంగారెడ్డి జిల్లా పురస్కృతి (2008)

తేజ ఆర్ట్ క్రియేషన్స్-ఆచార్య తిరుమల సాహితీ పురస్కారం, హైదరాబాద్ (2008)



## 1

ముసలితనం వచ్చేదాకా ఎలా బతకాలా? అని
ముంచుకు వచ్చింతర్వాత ఎలా చావాలా? అని
ఎంత దుష్కరం?
అడుగడుగు గండాల జీవితం!

- అడుగడుగునా!

## 2

పాదును తొక్కి చంపేయాలని చూడదు ఎదిగిన చెట్టు
వేరు కాళ్లతో
పొదుగును చీల్చేయాలని చూడదు ఎగిరిన పిట్ట
కాలి గోళ్లతో
ఒక్క మనిషే...,
తెప్ప తగలెయ్యాలని చూస్తాడు పబ్బం గడిచిందని.

- పోలిక?

## 3

చాదస్తం, సోమరితనం, నిర్లక్ష్యం మూడూ
మూడు తిరుగులేని శాపాలు జీవితానికి,
ఒక్కటి ఉంటేనే కష్టం మూడూ కలిస్తే?
చాదస్తం జీవలక్షణమనుకోవచ్చు
సోమరితనాన్ని క్షమించవచ్చు అయ్యో! పాపమని
ఏంచెయ్యాలి నిర్లక్ష్యం పోపుని? వెనుకా ముందూ చూడని ఘాటుని?
సాగుబాటు చాటున శిక్షాభయంలేని పొగరుని?

– కింకర్తవ్యం?

## 4

అతి దయనీయం ఒంటరితనం
సానుభూతిలేని మనస్తత్వాలు చుట్టూరా మసలుతుంటే,
చాలా పెద్దమాట మమకారం!
పలకరింపులోనూ పచ్చిస్వార్థం పడగవిప్పుతుంటే.

– ఘోరశాపం.



## 5

ఆగనిస్తాయా ఆడంబరాలూ ఆర్భాటాలూ
అసలే మనిషి!
ఎంత నయం మేకమెడ?
ఊరేగదు ఊగే చన్నులతో.

– తిప్పలాట.

## 6

ఎంతసేపని?
మంచిగా తీసిమ్మనే కోరచూపులు నరికి పారెయ్యడానికి,
కొబ్బరి బోండాలు కొట్టే గాజుల చేతికి
దెబ్బతిన్న బెబ్బులి పంజాకి.

– రెచ్చిపోతే.

# 7

పులి తింటుంది తన పిల్లలనే, పాము మింగుతుంది తన గుడ్లనే
కానుపు ఆకలి చాటు క్రౌర్యం మాటున
అజ్ఞానమా? స్వార్థమా?
సంతానాన్ని చంపుకుతినే మనుషులది.

- ఏది?

# 8

పిల్లాణ్ని ఒళ్లోనే కదా కూచోబెట్టుకున్నా?
నా ఒక్కదానికీ ఐదురూపాయలు - షేర్ ఆటో డ్రైవర్‌తో వివాదం,
సామాను నెత్తిమీద పెట్టుకొని ఎక్కితే మాత్రం
బరువు గుర్రానిది కాదా?
తేతేవమ్మా!

- తెలివి.



# 9

ఆస్తి స్వాధీనం చేసుకున్నారు వారసులు
అయ్యా!
మీరే చేయించాలి ముద్రణలు.

- వారసత్వం.

# IO

గుడి నిర్మాణానికి కొట్టే రాళ్ల సవ్వడిలో
పిక్కటిల్లేది ఓంకారమా?
ఆకలిపేగుల హుంకారమా?

- చెప్పండి?

## 11

ఆత్మశుద్ధి చేస్తాయా?
చెరువులో మునకలు,
పామును చిదిపేస్తాయా?
పుట్టమీద బడితెలు.

- సాధనం?

## 12

ముక్కుకు కంపుకావచ్చు కంటికి నచ్చింది
నోటికి ఇంపుకాకపోవచ్చు ముక్కు మెచ్చింది
చెవి మెచ్చకపోవచ్చు నోరు పలికింది
నోరు మింగేదంతా పడకపోవచ్చు కాయానికి
మన సొంత భాగాలే ఇలా యథాయథలైతే
ఇంకెక్కడి సంపూర్ణత్వం? సామరస్య రాహిత్యంలో.

- గత్యంతరం?



## 13

బ్రేక్‌దాకా పరుగు బస్సులకు
ఓట్లదాకా పరుగు ఎన్నికలకు
పడిలేచేదాకా పరుగు కెరటాలకు
ఆగని పరుగు - పరుగు.

- ఏమని?

## 14

సెలవడగడు సూర్యుడు
వానకొట్టిందని చలిపెట్టిందని
విశ్రాంతి పడదు పనిమంతునికి
పనిగిట్టదు శ్రాంత చేతస్కునికి.

- నైజం.

# 15

చూసినదువు నాయనా! అన్నదట
వేశ్యకోసం తరుక్కుపోతూ
పోట్రాయి తగిలి పడిపోయిన
కన్న కొడుకును
తల్లి గుండె.

- మాతృత్వం.

# 16

ఎవరైతే ఏం? వినడానికి
తెల్లగా తెల్లారకముందే నా కవిత్వం
మా ఏరియా టీబడ్డీ అబ్బాయి రమేశ్-
రసహృదయం ముఖ్యం.

- అధికారం.



# 17

అటో నలబై ఇటోనలబై
కావడిబద్దకు వేలాడుతూ ప్లాస్టిక్ కుండలు
ఎంతభారం బతుకువాకింగ్?
మసకవేకువలోనే!
బెదరు చూపుల అమ్మాయికి.

- ఇబ్బంది.

# 18

చెత్తమీది ఆలోచనలే తప్ప
చెత్త ఆలోచనలు కనపడవు
చెత్త ఏరుకునే అమ్మాయిలో.

- విచక్షణ.

# 19

తలుపు తట్టడు చెత్తబాబు కూడా
అప్పుడే తెల్లారదని తెలిసి అనుభవంమీద
కొన్ని ఇళ్లలో,
సిటీలో.

- సోమరితనానికి.

# 20

ఎంతగొప్పది కర్తవ్యం!
చేవ ఉన్నా తిరగబడని కర్ర
పనికిమాలిన మనుషుల మీద
పారిశుద్ధ్యం ప్రధానంగా,
కసవు చిమ్ముతూ సిటీలో
నట్టనడిరేయైనా.

- పని.



# 21

ఇరవై అయ్యాయి రమణా!
మొన్న మొదలు పెడితే అంటే,
అలాగే ఔతాయి సార్ రాస్తూ ఉంటే
అని స్పందన
ఆంతర్యం కొలిచిపోస్తూ.

- నైరంతర్యం.

# 22

ఏం చేస్తుంది నాగమ్మ!
చాపకూడులో విషం కక్కక?
సాగనిస్తుందేమో కాలం
ధర్మనిరపేక్షంగా,
ప్రతినాటా ప్రతినోటా.

- కాలమహిమ.

23

అణచుకో ఆగ్రహం సకారణమైనా
మరలించుకో అప్పుడప్పుడూ కోర్కెలు సరియైనవైనా,
తిరగబడిన పాముతల తిక్కలోకం
కత్తిరించేస్తుంది తోక
తనదేనని కూడా చూడకుండా.

- సహనం.

24

వెనకావద్దు ముందూ వద్దు
సరిసమానంగా వద్దేవద్దు
ఏంచేసినా తప్పే చెయ్యకపోతే ముప్పే
పల్లేరుగాయ అందం.
అస్తవ్యస్తుల చందం.

- తప్పు.



25

ఇరకాటపు యవ్వారం ఇబ్బందుల ఆర్థికం
మర్కటపు సంసారం సిటీబస్సు ప్రయాణం
వారెవ్వా క్యా బాత్ హై
ఎటుచూసినా హైబత్ హై.

- పరిస్థితి.

26

చెవిలో ఎఫ్.ఎం. మ్యూజిక్ పువ్వు
చూపుల్లో మ్యాజిక్ లవ్వు
గడియగడియకూ సెల్లు బెల్లు
నేటి యువతకే ఆల్వేస్ చెల్లు.

- అయ్యారే!

## 27

ఎగిరి పడటమే తప్ప
ఎర్త్‌వైర్ ఉండదు కొన్ని శాల్తీలకు;
లబలబలాడి ఏం లాభం?
ఏమీ లాభం లేనప్పుడు.

- క్షమ.

## 28

కవిత్వం నా జన్మహక్కు
రాసి రాశిపోస్తాన్ ఏదైనా!
అహంభావం కాదిది రసప్రభావం
ప్రతీకవి స్వభావం.

- రసం.



## 29

ఇప్పించే హస్తవాసి ఘనం
ఇచ్చే చేతికన్నా
అవార్డుల పర్వంలో,
**దిక్కులేని రాముడే!**
ఎక్కడా ఎవ్వరూ తట్టకపోతే.

- దిక్కు

## 30

కాపీ కొట్టడమే పనైపోయింది
ఎన్నో సందర్భాల్లో
సృజనరంగాల్లోనూ ప్రముఖంగా
ప్రఖ్యాతులై పోతున్నారు మక్కీకి మక్కీలే!
అన్యభాషల్లోంచో తదన్య భావాల్లోంచో.

- అతి ముఖ్యం.

## 31

ఎప్పుడేం చేస్తుందో తెలియని
వీధి పిచ్చిదాన్ని కూడా వదలని
వెర్రెత్తిన లోకం!
భూమ్మీద పడబోయే సంతు సంగతేమిటి?
నమ్మాలా ఖర్మ సిద్ధాంతాన్ని.

- ఏంచెయ్యాలి?

## 32

ఎప్పటికీ కేంద్రీకృతమే అధికారం!
సడలింపు లేదు విదళింపు ఉండదు
భాష్యాలువేరు భాష్పాలు వేరు.

- సునిశ్చితం.



## 33

సాధన యాతనే!
ఏమౌతుందో తెలియదు
ఎప్పుడౌతుందో తెలియదు
మనసురాదు మానెయ్యడానికి
ప్రయత్న పరునికి.

- శీలం.

## 34

నీరదాలు మబ్బులు
క్షీరదాలు గోమాతలు
మిన్నూ మన్నూ చాలవు
కారుణ్యం నింపడానికి.

- తరం?

## 35

కోపాలూ తాపాలూ శాపాలూ పాపాలూ
అన్నీ ఆకలి రూపాలే!
అవనీతలం నందనవనం కాదా?
ఆ ఒక్కటీ లేకుంటే.

- లేకపోతే.

## 36

సహారాలో ఒయాసిస్సు
సిటీలో ఎమ్ఎమ్‌టిఎస్ రైలు
ట్రాఫిక్ పద్మవ్యూహంతో చెడుగుడు
పొల్యూషన్ భూతానికి విరుగుడు.

- ఆపద్బాంధవి.



## 37

వానరాకూడదు తానుగింజలు ఆరబోసినప్పుడు
తప్పకుండా రావాలి విత్తనాలు వేసినప్పుడు
తన సంక్షేమ దృక్పథ మనస్తత్వం
ఎంత జల్లెడ పట్టి చూసినా.

- ఏకపక్షం.

## 38

ఎంత అయోమయం జీవితం?
కన్నతల్లి ఇచ్చిన కాళ్లు చేతులు కూడా
వెనువెంట రావు చివరిక్షణంలో
మాయో భ్రమో తెలియదు
నిండునూరేళ్ల కలలపంట.

- విచిత్రం.

## 39

మానవ సంబంధాలు మురగబెట్టే కంపు
తాగుడు
ఏంచేస్తుందో తెలియదు ఏం చేయిస్తుందో తెలియదు
మనసు మనసు కాదు,
మనిషి మనిషి కాదు.

- మెలాసిస్.

## 40

వైకుంఠపాళీ పెద్దపామే నయం
రాజకీయంకన్నా
కనీసం మింగుతున్నదని తెలుస్తుంది.

- వామ్మో!



## 41

ఎలా పచ్చగా ఉంటుంది జీవితం?
ప్రకృతి జవసత్త్వాలను బద్దలుకొడితే,
అణు విస్ఫోటనం కన్నా ప్రమాదం
పగిలే ప్రతీ పరిసరం.

- ఎలా?

## 42

కూల్చే ప్రతి చెట్టూ
పర్యావరణ సమతౌల్యానికి చెంపపెట్టు
అధఃపాతాళానికి దించే తొలిమెట్టు.

- విభూతం.

## 43

ఎంతబాగుంటుంది!
తన అంత్యక్రియలు తానే చేసుకోగలిగితే
తన సంస్మరణసభ తానే పెట్టుకోగలిగితే
గొంగళి పురుగు సీతాకోక చిలుకై
ఎగిరిపోతున్నట్టుగా.

- బాధించకుండా.

## 44

ఎన్ని పొరలు మనస్సుకు?
తన నీడే తనకు భయం
అణువణువూ అనుమానం
సంశయాత్మా వినశ్యతి.

- అయ్యో పాపం!



## 45

ఏ ఆఫీస్‌లోనైనా ఒకటే టెన్షన్
పరేషాన్
జనానికి,
అరవైఏళ్ల స్వాతంత్ర్యానంతరం కూడా!
ఎంతగొప్పది ప్రలోభం?
అన్ని దశలూ దాటి ఆకాశమంత ఎత్తుగా.

- శిఖరాయమానం.

## 46

ప్రేమించు ప్రేమించే వాళ్లను
క్షమించు ద్వేషించే వాళ్లను
ప్రేమించు ప్రేమించని వాళ్లనూ.

- ప్రేమ.

# 47

టీబడ్డీ దగ్గర వేలాడదీసిన
టీక్యారియర్ వడ్డింపు పొద్దున్నే
చూసుకోకుండా కూచున్నందుకు నెత్తిమీద,
అన్నీ దెబ్బలే జీవితానికి
అనూపానూ కానకపోతే.

- జాగ్రత్త.

# 48

ఏమీ చెయ్యలేం మూర్ఖులను
ఎడ్డెమంటే తెడ్డెంగాళ్లను
తిన్నగా పొమ్మంటే వింటుందా?
వంకర పోకడల కర్కాటకం.

- కాని పని.



# 49

ఎంతకని జీవకారుణ్యం?
మనం ఆపినా ఆగదు
పైనుంచి పడిపోయే ప్రవాహం
పలు విధాల ప్రయత్నాలతో.

- ఉద్ధరించడానికి.

# 50

ఇల్లాలు కలిసిరాని కాపురం
తప్పుల కూపం ప్రత్యక్ష నరకం
బతుకుకన్నా చావునయం,
ఉన్నది ఉన్నట్టు అంటే.

- ఇక్కడే!

## 51

మోసపోవద్దు మొసలి కన్నీళ్లకు
అంటకత్తెర వేసే ఆయుధాలు ఆయువు పట్లకు
అంతా రామమయం అనుకుంటే అమాయకంగా
అంతటా పొడుచుకు వస్తాడు రావణుడు.

- ఏమనుకున్నారో?

## 52

ఆగిపోతాడా సూర్యుడు?
కారుమబ్బులు మింగేసినా
కాలగర్భం చీల్చుకొని జ్వాలగా ప్రజ్వలించక
పట్టపగ్గాలు లేవు పురోగమన శీలికి
పుట్టగతులు లేవు కర్తవ్య విమూఢునికి.

- సముజ్వలం.



## 53

తప్పుకాదు గుర్తింపుకోసం పోరాటం
తప్పుకాదు వ్యక్తిత్వంకోసం ఆరాటం
పొంగి దూకదా? సముత్తుంగ సాగరాంతరంగం
అవిశ్రాంత తరంగాలతో నిరంతరంగా
అణచివేసే చెలియలికట్టను హత్తుకుంటూనే.

- పొంగు.

## 54

కలవారి గుమ్మాల పూలసరాలు
బక్కపేగుల ఆకలి రణాలు
వత్తి కాలుతుంటే ఇటువైపు
వెలుగులు చెలరేగుతుంటాయి అటువైపు.

- వైరుధ్యం.

## 55

స్వభావరీత్యా తేడాలేదు
వీధి బిచ్చగత్తెకూ విస్తృత అభ్యర్థనలకూ
వస్తుతః తప్ప
ఏ రాయైతేనేం నెత్తికొట్టుకోవడానికి
ఏ ముఖమైతేనేం ఈడిగిల పడిపోవడానికి.

- చేసాది.

## 56

ఎదురువస్తుంటే బాగుంటాయి కొన్ని
వెనుదిరిగి పోతుంటే మరికొన్ని
లక్ష్మీదేవి పెద్దమ్మల్లాగా
ఏది స్వీకరించాలో ఏది తోసి రాజనాలో
తెలిసి చేయడమే విజ్ఞత
తెలివి చూపడమే ప్రాజ్ఞత.

- ముందు వెనుకలు.



## 57

చేతనైనంతవరకూ చెయ్యవచ్చు
ప్రయత్న విక్రమార్కం
చెప్పలేని మనసు కోత,
ఫలితం శవబేతాళమైతే.

- ఇంకా?

## 58

ఆవులింతలోనే ఆకాశాన్నంతా
గదుముకొనే ఆకలి
పాకులాటలోనే అవనీతలాన్నంతా
అదుముకొనే ఆరాటం
శైశవం.

- ఆత్రం.

## 59

చెలరేగితే అడవిలో సంక్షోభం
పిట్టలకెక్కడిది ఆనందం?
వాతావరణ సంక్షోభం సమాజనాశకం
మనస్సంక్షోభం సర్వనాశకం.

- పూర్తిగా.

## 60

ఒంటరిదే కళాకారుడి బతుకు
ఎంతమంది ఉన్నా చుట్టూరా!
సమూహంలో ఏకాంతం
చెక్కుచెదరని స్వగతం.

- స్వభావం.



## 61

ఐపోతుందా మధువు కలశంలో?
ఆగిపోతుందా చైతన్యం 'సాకీ' చేతిలో
విమూఢులకు అర్థంకాని అంశం
రసజ్ఞులకు విప్పి చెప్పనవసరంలేని తత్త్వం.

- ఆగితే.

## 62

ఎందుకు ఎక్కాడు శిలువ ఏసుక్రీస్తు
అణువణువూ చీలుస్తున్నా ఆటవిక శాసనం?
ఎందుకు తాగాడు విషం సోక్రటీసు
గొంతుగోడలు బద్దలౌతున్నా?
అజ్ఞాన సమాజం అంతరాత్మ
ఆవులించైనా లేస్తుందేమోనని.

- ఆంతర్యం.

## 63

ఎన్ని రాజకీయాలు? ఎన్ని కుట్రలు?
ఎన్ని కుతంత్రాలు? ఎన్ని హత్యలు?
స్త్రీకామనలో!
అందుకే అగ్రసరం అరిషడ్వర్గంలో
మానవ చరిత్రలో కామం.

- నిజం.

## 64

ఎంతటి అదృష్టవంతులు!
బతుకులో చీకటీ వెలుగూ
విడివిడిగా చవిచూసే వాళ్లు,
ఎప్పుడూ చీకట్లోనే వెలుగు పిండుకోవాలంటే?

- ఏది దారి?



## 65

ఎంత మధురం నిరీక్షణం!
నిరంతరోద్వేగ సంభృతం,
ఎగురుతూ పిట్ట
నేలమీది గింజకు వెతుకులాడినట్టు.

- ఈత.

## 66

ఎక్కడోలేవు స్వర్గ నరకాలు
ఇక్కడే ఇలలోనే,
దారిద్ర్యజరావ్యాధి మరణాలు నరకం
నితాంత సుఖ సంతోష వైభోగాలు స్వర్గం.

- రెండూ.

# 67

దాస్యానికి మారాకులు
అనిశ్చితి అభద్రత అస్వాతంత్ర్యం
స్వేచ్ఛా ప్రసూనాలు
నిర్ణయాధికారం నిర్భీతి నిస్సంకోచం.

- మనఃకోశాలు.

# 68

ఎంతకష్టం విగ్రహానికి
అగ్ని పరీక్ష నిగ్రహానికి
ఏడెనిమిది గ్రహాలు జొరబడితే ఒకే క్వార్టర్‌లో,
పెగ్గులో రగ్గులో రాంభజనో
ఏదో ఒకటి
తప్పక కావాలి తట్టుకోడానికి.

- అప్పుడప్పుడూ.



# 69

కొంత నాశనం చేస్తే
కన్నుగానని ఉపేక్ష
అంతా నాశనం చేస్తుంది
మిన్నుగానని అపేక్ష.

- సర్వం.

# 70

ఒక్కోసారి పరామర్శ
పుండుమీద చల్లే కారం
ఓడిపోయినందుకు కాదు
తోడికోడలు నవ్విందని.

- ఎద్దుపుండు...

# 71

విడిపోతాయి బంధాలూ అనుబంధాలూ
బాధలూ బాంధవ్యాలూ
ఎక్కుతున్న ఊపిరినిచ్చెన మెట్టు విరిగిపోతే.

- ఇంకేమిటి?

# 72

చెప్పలేనంత సంబరం
ఉదయం కన్ను విప్పితే
పట్టరానంత విషాదం
అస్తమయం కన్ను గప్పితే.

- ఇరుపక్కలా.



# 73

సృష్టి అంతటా మాతృత్వమే!
ప్రతి విరుపులో ప్రతి మెరుపులో
కూలి పడుచు టిఫిన్ బాక్సులో
మేలి పయ్యెద అంచు నగిషీలో
ఏ రాయి ఐతేనేం పాలిచ్చే తల్లి బొమ్మ చెక్కడానికి?
ఏ రంగు ఐతేనేం పసిపాప నొసటిబొట్టు దిద్దడానికి?

- పరిణతి.

# 74

ఎన్ని ప్రకంపనలు?
విభిన్న ధ్రువాల మధ్య లోలకంలా
క్షణం విరామం లేకుండా ఊగిసలాడుతూ మనస్సు
ఆశా నిరాశల నడుమ,
కాలాన్ని కత్తిరిస్తూ
శీలానికి వెలుగు పూస్తూ.

- అదే పనిగా.

# 75

సంచీ
మంచిని దిగమింగేసిన తర్వాత
కల్లబొల్లితనం
కర్తవ్యనిష్ఠను కాటువేసిన తర్వాత
వల్లమాలిన ప్రలోభాల పెనుమంటలు
మానవత్వాన్ని వల్లకాట గలిపిన తర్వాత...

- ఇంకేమున్నది గర్వకారణం?